ములు। క్రిందశ్రీపర్వత పురాణమహిమ రుద్రాణికిరుద్రు। డా సతిమె
చ్చు తో నటమున్న యమ్మో దాననేకయుగాబ్జ దంబులనాడు। నలి
మల్లికార్జున నామమన్వాక్య। మ.రుటగా జేసి యయ్యుగంబునను। చం
ద్రగుప్తుండన జనుభక్తుడొకడు। చంద్రవంశుండు కజ్జనపతితనయ। చం
ద్రవతీకన్య సరసచ్చైతన్య। సాంద్రతరాగణ్య సంచితపుణ్య। యనురక్తి
శ్రీమల్లికార్జునదేవు। జనుదెంచి తనతోడి సతులును దాను। ప్రతివా
సరంబును భక్తిగొల్చుచును సతియొక్కనాడు హర్షముదులుకాడ।
కిన్నరగంధర్వ గీతపరికలిత। సన్నుతనాద ప్రసన్నతమీరి। యతిమ్ర
దు మధురసమంచితాలాప। గతులసప్తస్వర కలితమైశ్రుతులు। సాంగ
మైమోరివ దొడంగపరీతి। శృంగముల్ గూడ జెలంగిదిక్కులుగ। ంగ
నాకన మధ్యమంగనందున్న। గంగంబలరంగపాతాళ। గంగయంతంత
కుత్తుంగతరంగ। రంగముల్ నలిగడు వంగమీదటికి। బాంగసురల్ నుతిం
ప.గశీలలుగ। రంగకాష్ఠములిగుర్వంగమాధ్యములు। గాత్రలరసంబులు
గోత్రలచిత్తములు। సోలకానలతలు దాత్రలకిన్నరులు। దూలనుమానాథు
మోత్రలనానంద। లీలదలిర్పన బ్యాలసంప్రీతి। బాడసుగతులోవి గూడ
నాచంద్ర। చూడబార్వతియును ప్రోడమనంబు। గూడనాదాంబుధి
క్రీడదెలుచునుగ। జూడమెచ్చులుదులు కాడసాంబుండు। మెచ్చితియబ్జా
స్య మృగశాబనయన। ఇచ్చయయ్యదివెండు మిచ్చెదననిన। శ్రీపర్వ
తోత్తుంగ। శృంగోత్తమాంగ। దీపితఖ్యాపిత దివ్యలింగాంగ। మీమాళి
యందున మేళనంబునను। ప్రేమంబెలర్ప నర్పించినయట్టి। యీమల్లికా
దామ మెల్లకాలంబు। మీమాళియందున మిళితమైయుండ। దయనేయు
మనుచు చంద్రవతి గయు వేడుటయు। రయమున తేజోపరాజితంబైన
మల్లికాధామము మానాథుడునిచె। సల్లీలజాహ్నవీ చంద్రమధ్యమున
గంగాతరంగిణీ సంగతోత్తుంగ। రంగాంతరంగ పరంపరోద్ధూత। పృథు
లకూలంకష ఫేనవిభాతి। కథనీయనుగు మల్లికాధామమరియు। నర్జు
నకాంతి జెల్వగుట శ్రీమల్లి। కార్జునుండనునామ మయ్యెలోకములు
తక్కకాసలింగ ప్రతతులకునట్లు। యొక్కొక్కనామంబు లొనరనొక్కొ
క్క। కారణంబునను నాఖ్యాతితల్లింగ। చారుపూజాఫల సౌఖ్యమెట్లనన్

నగణితంబెట్టి లింగాకారంబైన। నగసంస్మరణ దర్శనస్పర్శనముల। వల
నసస్వర్గాది పర్గాదిసౌఖ్య। మలరారుచున్న దే మనిబ్రస్తుతింప! వినువున
ర్జనస్మవి విద్యతేయనుచు। ఘనపురాణాదులోకకోటిమ్రోయగాన। య
నుచు వెండియు మల్లికార్జునగురుడు। ఘనుఁడైన శ్రీపర్వతుని వినుతింప।
వరగురునాథ నీవచనంబులేను। విరచింపపర్వతు వినుతియేయనుచు। ను
న్నదేవీనుల కొక్కంతతనివి। విన్నపంబేవని వినియెదనాకు। క్షిప్రింబ
యీపని గృపసేయుటకును। నుప్రసన్నాత్మ మహాప్రసాద బు। వారక
పర్వతు వర్ణనయుఁగ। మీరానతిచ్చిన చారుసత్కృతిని। లెక్కింపశి
లలెల్ల। లింగరూపముల। యక్కజంబుగవాక్య మదిసాంగముఁగను। పాత
నకేతనావహమూర్తి లింగ। పీఠప్రకాంబై పృథివిశ్రీనగము। మీదివ్య
దృష్టికి మించివెలుంగు। భేదమెరుంగ మీపాదముల్ గాని। మీయాజ్ఞద
లమోచి। పోయెదనిష్ఠ। దాయకమీప్రసాదము గృపజేసి। రక్షింపుమని
యను రక్తిదోనయ్య। యీక్షితిసాష్టాంగ మెరిగి శ్రీగిరికి। నరుగంగ నను
గ గ నన్నినిక్కులను। ధరణియీనినభంగి తండతండములు। నెరసుల
యడవుల గరుసులుద్రోవ। వెరసురుగఁమువంగ నరసలమంది। నరసలజ
నుదెంచు నరనలజూచి। పుణ్యషులగని హర్షఫులకలువొదల। వారువా
రునునేగు దేరసంతసము। గూఁడమహేశ్వర ద్వారమార్గములు। దం
డడిపెన్క ముందలగూడనడువ। సండడింపకమంచు జక్కరడనుచు। వెన
కజక్కకుడంచు నేగమయంచు। జనుడుముందటయంచు జనకేమియం
చు। తొలతొలడనుచు నాత్రొప్రబొండనుచు। జనుడుముందటయంచు
దవ్వెంతయనుచు। సిరిగిరియిదేయంచు జేరితియంచు। పురమున్నగుబో
దునోయంచు। పాదపాదండిపుడేమి బోయెమాకనుచు। పదినాళ్లకైన
బోయెద మొకోయనుచు। గుడ్డవెట్టకుడంకు కోరతేమియంచు। నడ్డమేమ
నకేమి యాగుదేర్వనుచు। నీయూరిబగుతు విశ్లైరుగఁదేయనుచు। నాయే
ధువిడువ మాయీయూరననుచు। బారెడెట్టులనైన బారు తెండనుచు।
నారగింపక మరుగుదేననుచు। లింగావసరము చెల్లిడినెమీకనుచు। జంగ
మోచిత ముఁపళ్యముఁగదాయనుచు। కావళ్లవారి జక్కగనీకుడనుచు।
కావళ్లవారిని కానికారనుచు। ముద్దులాడకపొండు ముందటననుచు।

నద్దిరాయిల్లైన డొద్దపొమ్మనుచు। చలపట్టునడిగె సాంఖెల్లననుచు। చ
లమదీవాగున గలవకాయనుచు। కొన్నిపువ్వములైన గోసితెండనుచు।
నున్నవీకుసుమంబు లోకకొన్నియనుచు। తోరినసీకెంకెట్లు ధూపాగ్ని
యనుచు। నావేలసుభక్తు లగ్గలంబనుచు। నెగుదునోకొవత్తు లీపూటక
నుచు। నెగుదకున్నను లింగ మెరుగుగాకనుచు। పదియోగిరముల లవదు
నోకాయనుచు। పడియోగిరముకాక పథమునకనుచు। సాగెనేలింగావన
రముమీాకనుచు। శ్రీగిరియనుగు నారోగణమనుచు। కడిదినోనేమముల్
గడువంకననుచు। కడిదిమెబసవంన గలుగంగననుచు। పాదపాదప్రొద్దు
లు బుచ్చకయనుచు। కలదెనీసాతు నిక్కలకుదాననుచు। క్రిందులో
జొరజొరగానేలయనుచు। గ్రిందులోవునగాని గడవలేననుచు। యిదెకం
టిరే శ్రీమహేశ్వరంబనుచు। నదిమీాదట మహేశ్వరావాసమనుచు।
కడునొప్పుబహు హేమకలశంబులనుచు। బడుగుదేవరయధః పతివం
ద్యుడనుచు। జయపెట్టుడిట గూడసాతెల్లననుచు జయజయఖేయఖేజ
యజయయనుచు। నుల్లాసమడరనిట్లుగుతరాన్యోన్య। సల్లాపనంబులు
నరమైతనరె। జనుదేర శ్రీమహేశ్వరభూధ రేంద్రి। మున విలసిల్లు। న
ప్పురమెట్టులనిన॥ శ్రీకుధరోత్తర శృంగసంఘములె। ప్రాకటంబుగ
హేమ భవనంబులవియు। విరచితపరిత్యంత పర్వతానఖులె। కరమొప్పు
హర్మ్య నికాయంబులవియు। యిలనుండిముక్తికి సిద్ధసోపాన। మలయ
ట్లు సోపానములు నొప్పునదియ॥ పటివియత్కన్యకా భరణవిభాతి। నటి
యించుమణి తోరణంబులయదియు। దివిముక్తికాంతలు డవిరశ్రీగిరికి।
నవినయంబువీచు చామలరట్లు। విచువీధిందాక శ్రీవృషభాంకమనుచు। తే
నరువిచిత్ర పతాకంబయదియు। ఖ్యాతిగావ్యాన హస్తాంకమైతోంచు।
వాతపూరణముల వడినొప్పునదియు। మహిజటాకుధారిషు మకుటనంఘ
హితే। మహితజ గమలిగ మండలియదియు। ప్రవిమలపరిమధ పుష్ప
కపమానములు। పవిదనొప్పుగుగణ భవనంబులదియు। అర్ణవఘోషం
బు లట్లహాసికమును। ఘూర్ణల్లుబహువాద్య। ఘోషంబులదియు। అట్టి
మహేశ్వరోద్యత్పవసరము। చుట్టునున్నధుకరశు కపికసికర। రవపకల్పి

తరాజితంబనగ। నవక మైత్రీరు నానావనంబులును। ఘనరుద్రపాదోద
కమునచు వరస। కునుగలశంబుల గొనివచ్చియున్న। చందంబుననజ్జ
సంపూర్ణమగుచు। నందితంబైయొప్పు నారికేళములు। నల శైల సంద
ర్శనఫలముల్వరున। నెలమినీజాలదు మేమన్నయట్లు। ఫలభరితంబులై
బధమార్గ్యములనె। యలరాదు కదళీఫలానీకములును। చూతముశ్రీ
గిరి జూతమన్నాదు। జూతమనుచును రసాన్వితఫలములు। తివిరిదర్శన
ములీ దెచ్చినయట్టి। పదివినొప్పగుఫల భరితచూతములు। వినుమువిూ
విూయాల్లు వెడలిసనాడు। ఘనభక్తిమైదమ్ము గడచినారింక। నమచింత
లేల సోదండనుకరణి। నమరియరితంతనొప్పారుచింతలును। చెలగిననంతు
డు శ్రీగిరిచుట్టు। గలయఫలావళుల్ గట్టినమాడ్కి। యిలనొప్పుదాక్షి
ల యీ రేలమాది। ఫలముల నిమ్మల ఫలమంజరులను। యిలమల్లికా
ర్జును జెసగుమా పేర। పొలుపుగాననివిచ్చు బొడ్డుమల్లియలు। కుందం
గనేల శ్రీగోత్రింబుజెంది। కుందకుండనినవ్వ కుందగుచ్ఛములు। సేవ
మైసీళు భజింపనివాని। సేవయేటికినన సేవంతివిరులు। గిరులతో భవనాగ
కేరియనిన। గిరియ దేయననాగ కేసరంబులును। నగములన్నియుబెంటి
నగమిలీనగము। బాగడపున్నగమను పున్నాగములును। పొగడనొప్పారు
శ్రీభూధరేంద్రింబు। పొగడ గేయనుచున్న పొగడపుష్పములు। గిరినెవ్వ
రెవ్వరెక్కంతురో తన్ను। వరదుచే నెవ్వరెవ్వరు గొండ్రుపదము। చూచె
దమనుచున్న చూడ్కి కందంద। పూచినెండియునొప్పు పుష్పవాటికలు।
కనుగొంచుపొగడుచు గ్రక్కునవచ్చి। తనరారుతత్పురాంతర్వీధులందు।
గ్రందారనొక్కొక్క గములుగాగూడి। జిందులువెల్లుచు చిత్తంబులలర।
జెలగుచునలదుచు జెరలుపొడుచుచును। జొలయుచుమలయుచు పొరినం
తసిలుచు। మూంగుచునేంగుచు మూకలుగొనుచు। వీంగుచునాగుచు
విస్మితులగుచు। నుక్కుచుజక్కుచు నుల్లసిల్లుచును। సొక్కుచునిక్కుచు
నుగతినిల్చుల్చుచును। ఆడుచుబాడుచు సట్లమొక్కుచును। గూడుచు
జాటుచు గోయనియార్చు। చును చప్పటలు వెటుచును సరిపదము।
లను సంఘటింపనాళతులుసేయుచును। సమ్మదంబుననిల్లు జనుదెంచువ
రస। యమ్మహేశ్వర సగంబరిమురినెక్క। భావింపనుత్తర భాగమంత్త

యును। దోఁకిపలుగట్టి యద్భుతమువటిల్లి। చెట్టునుగట్టును సిలలును సెల
లు। మెట్టయుబల్లము మీఁదునుక్రింద। సదుగూఁడబరసమై యలరెవి
చిత్రి। పటముతత్పర్వత పతిగప్పినట్లు। సుఁ గిరి దేగడెఁ హేమగిరియై
సిరగిరియంతయు నరగిరియయ్యె। నక్కజంబలర సిస్లైక్కుచు నెడల। జిక్క
చునొండొరు జేయూఁదుకొనుచు। నుక్కుచేనేచుచు మల్లడిగొనుచు।
దొక్కుచునటతోఁ పిప్పు దొప్పులాడుచును। అంతంత జయజయా యత
రావములన। గాంతరంబులదిక్కు లద్రువఘూర్న్నిల్లి। చక్కనపరి షత్కో
టిసుగతి। కిక్కమైచనునగంబెక్కి దక్షిణము। నరనిజాధారా ప్రివాహ
ఝుత్కార। విరచితద్వారంబు విన్నయంతటన। భూరిపాతకకోట్లు బో
లియించిరుద్రి। ధారాంబువులదృత స్నానులైజనులు। నామహేశ్వరదేవు
నర్ఘిభజింప। దామున్న సమయోచిత క్రియల్ సలిపి। పండితారాధ్యుం
డుఁ పంక్తిపాద। పుండరీకాంతరంగుండుదోసయ్యు। శ్రీమహేశ్వర దేవు
శివునుతింపుచును। గామించితద్భక్త ఘనసంఘమునకు। పవిత్రితభక్తిమై
బర్వంబునలిపి। యనిరళభ్రీతి గుర్వర్పణ జేసి। ధరనూఁది సప తాళ
ముల్ గాచి। యురుతరంబై మీఁదనుడు వీధిగడచి। పరగుళ్ళంషూబులు
ఫలితాసుమఃఖ్య। తరుదివ్యగుల్మలతా వితానములు। నందులబహుళో
ర్కటావలిచరులు। నందు నాకులుదక్క నలరుపక్షులును। రుద్రిదారయ
పెక్కు రూపంబులైయు। నూదుర్కీర్తిధారగున నూనథారులును। శ్రీసు
బే రేశ్వర సిద్ధేశ్వరాద్య। నేకలింగములు మహేశబిలములు। కనుగొని
యద్భుతాకాంతాత్ముఁడగుచు। ఘనమగుదన్నగా గ్రిముశివపురము।
మహీవయుడద్వార మహిమయుతీర్థ। మహిమయువినుచు ధీమణిసో
నమయ్యు। మననమునహాపించి మల్లికార్జునము। జనసభిముఖుడుగా
సొంతునునలరి। నూరెలజియవెట్టుచును సంతసిలుచు। భోరుననగమధ్య
మునదిగసారి। రతిగల్వావృక్షంబు బాకికెదుకల్ప। లతయుమబోలె నల్లన
కుర్వజేరి। యక్కజంబందు స్వర్గావర్గములు। నెక్కొననిల్చిన నిశ్రేణు
లట్లి। నెక్కొన్నయారెండు నిచ్చనల్ గడచి। గ్రిక్కునదన్నగా గ్రింబె
క్కచనగ। జనగదూఁప్పునను పంచకాళిశమూఁత్రి। మున రమ్యమగుచును
మునిపశ్చమమున। కదునొప్పెసగు బిలకల్యాక్తిసెన్న। బడు శ్రీచతుర్ము

## చతుర్ముఖబసవేశ్వరమహిమ.

ఖబసవేశ్వరుండు। ఆదేవదేవుమహాత్మ్యమెట్లనిన। నాదిసర్గములకాది। య
నుసృషసర్గ। నభవుండుశివుడు। వీలార్థమైసృష్టి। నభిముఖుండై శ్రీసృ
షాధీశుజూచి। చనుముగోమాతృ పంచకములోభదర। యును నంద
యును శీలయునుసుమనసయు। గొనుచు బొమ్మమదులకు సురభినిలుపు।
మునరంగధరణి బశూత్పత్తిబడయు। శ్రీకుధరోత్తర శృంగంబునను।
దేశాంతమున వసియించునావుడను। చనుదెంచియిలసహస్రిదను:పరి
మాణ। మునచుకిరించడనొక్క। పురముగావించి। భువినాకృషభ పుర
మునసుచతుర్ము। ఖ వృషభేశ్వరునిల్పి కాంతుగొల్చుచును। నాల్గుము
ఖంబులై నాల్గుదిక్కులను। నాల్గుగోమాతల నలవరింపుచును। తొడరి
గోమాతృ చతుర్ముఖంబందు। బడసెదాపశురాసి బడసివానికిని। పృధ
తంబుగా బిలపర్వతంబనగ। పృధివికి వెడలింప బిలముగావింప। నవియు
నువెడలె కన్యాసిద్ధనాథు। భవనోత్తరమున దత్పభువులు వెడల। గానం
తమునికన్యకలువచ్చిహేమ। ధేనువులకుగొన్ని ధృతికొనిపోవ। చిక్కినపశు
రాశి సృష్టిపెనిలిచె। నక్కజంబుననంత నఖిలలోకములు। వృషభేషు
డాసృష్టి విరచింపనగియు। వృషసర్గనావేద। విదితమైచనియె। మూల
మైమూచతుర్ముఖవృషభేశు। నాలుగుముఖముల నందితంబయ్యె। కనుగొ
నధర్మార్థ కామమోక్షములు। కును గారణంబులై గూడుశృత్యుక్తి
నదిగారణముగ మునులంద్ధరునదయు మొదలుగా శ్రీచతుర్ముఖబసవేశు।
పరమేశు వృషభేశు పాతాళవృషభ। పురవరాధీశు శ్రీభూధరావాసు।
నచింతురట్ల కన్యాసిద్ధనాథు। నచింతురందు ల నందులపొర్దు। కను
నర్థి మునికన్యకలు దరికాలంబు। నెడపకయావృషభేశలింగంబు। నత
మునియూథు కన్యాసిద్ధనాథు। వ్రతమూపమెనగని వాళింతురర్థి। నది
మొదిగాగ గన్యాబిలంబయ్యె। నదికారణముగ కన్యాసిద్ధనాథు। డనవొ
ప్పయణిమాది యఖిలసిద్ధులకు। మనికిపట్టైనంత జనులుగీర్తింప। నక్షీ
ణతరకీర్తి యాలింగమూర్తి। దక్షిణంబుననముఖ్యన్మహామహిమ। చేకొ
నదిక్కుట శ్లోకునిపుణ్య। వాకినిహితచకి వాకినిస్మరత। తాకినిసధూ

మడాకినియమృత। సేకనిదివ్య మందాకినియొప్పె। కావునమును బిల్వో
కమైనయట్టి। యావృషభేశ్వరం బలరారెమున్న। వెలయజతుర్ముఖ
వృషభేశు పేర। నిలచతుర్ముఖ బంవేశ్వరుడొప్పె। పసరింపనావృషభపు
రంబు పేర। వసుధపైబసవపుపురంనాబరగె। యీచతుర్ముఖ బసవేశుభ
జింప। యీచతుర్ముఖ వృషభాంకలింగంబు। భజియింపనభిమత ఫలము
లుబొందు। నిజభక్తిముక్తులు నెక్కొనజెందు। నట్టిశ్రీబసవేశ్వ రాలయం
బంత। కట్టెదురనుగాంచె ఘనుడుదోనయ్య। తడయకనిష్టార్థ దాతనా
నెన్న। బడిఁజతుర్ముఖ బసవలింగంబు। నత్యర్థిసముచితాభ్యర్చితుజేసి
నిత్యలింగార్చనానియమముల్ దీర్చి। పండితార్పణముగా భక్తమం
డవికి బండువునేయనా పరసయునలరె। అందుండి సాంప్రాయములు
గూడుచును। జిందులువాడుచుజలగియాడుచును। చప్పట్లుబెట్టుచు నఖిలి
బట్టుచును। యుఁపొంగిపేర్చుచు నుబ్బియార్చుచును। మనికులబిలుచును
మతులగలచుచు। విచుకులుసేయుచు విమతుబాయుచును। సద్యము
ల్చదువుచు బ్రిబలియొదవుచు। వాద్యముల్ గూర్చుచు వశిఁదర్చుచు
ను। తాళముల్ బట్టుచు దమముదట్టుచును। సాళెముల్ జూపుచు జడతి
లాపుచును। రమణజొక్కుచు బయసములుదొ్రక్కుచును। భ్రమరి
బోల్చుచు సమభంగినిల్చుచును। గతులుగ్రాలుచును నాళతులుసోలు
చును। శ్రుతులవ్రాలుచుభక్తి గతులదేలుచును। యొసగలుజెప్పుచ
ను యుక్తినొప్పుచును। బసవేశునకు సమర్పణమయ్యానసుచు। యో
విప్రమధులనాద్యుల దలదలంచుచును। లీలవిమ్మాడ్కి కేళికలుసేయు
చును। యేతెంచిశ్రీబసవేశుదర్శించి। భాతిగానిష్టార్థ ఫలసిద్ధిబొంది
రసికత దోనమ రాజయ్యగారు। బసవేశుమహిమయే బ్రస్తుతింపుచును
శోభిల్లు మల్లికార్జునదేవుపురవ। రాభిముఖుండయ యరుగనంతంత
నంతసంబునబరి షత్కోటియునునిరం తరగతిదొంటి యట్లయాడుచును
పాడంచునట పెక్కు పథములపరన। గూడుకొనుచు వాద్య ఘోషనం
నగ। బహునదసంగమ। పరిసరతజేర్చ। బహుళభాగీరథీ భావననిదుగ
పరసపదాహతి ధరణియుప్పొంగ। జరియించుపథములు జలిమిరిదోప
పవులనెండిన పాదములంకురిప। జీవికినరదుల జిగురులుదనర। వాడినలతే

లు వడిపల్లవింప। గూడదారినయట్టి గుల్మముల్ పొదల। జేరి చెందినయట్టి శిలలుగరంగ। ఆరిచినగిరులు మూరెడుబెరుగ। తవసిపైబారు మేఘము లురంజిల్ల। నవకాశమగు జయలాదర్శ వంబంద। భంగిగాశ్రీగిరి పరస రాశకును। పొంగినర్వాంగముల్ జలగించునట్లు। జనుదెంచుపరసలో జనుదెంచుభక్త। జనములుజనుదెంచు చాళియట్లనిన। పోదగగుసంబవు

→జంగమ్మకోట్లనడకలు.←

ల్ పోదగగుపసిడి। గొడుగులుబావలు గూడలోహంపు। పావలుదం తపు పావలురాగి। పావలువాగల పాదరక్షలును। దొడుకొనిపదన ఖద్యు తులుదర్పణము। లడరిశిష్యావళి కిడునట్లువెలుగ। చందనకోవులు సరి వాటిగావు। ఎందంబులగు గరికంచుకావులును। వలనొప్పుకప్పడంబులు నుకాపీన। ములు మీాద గూడకట్టులుగానుపి:ప। వెలిచేరెములు గలు కులుకొంతదోవ। బిలుననిజోడు కుప్పసములుబూసిపట్టు। దొంగళ్లును ట్టువీణెలును। పట్టుతాళ్లును పాత్రితపట్టువస్త్రములును। చందురుకావి పల్చడినల్వా.ళొల్లు। జందెలుతివళులు జెందికందోళ్లు। లోందమీాదికినెత్తి కొందగిలించి। పరువడిదొడిగి కుప్పసములుమీాద। కరమొప్పుగాపటి కపునరంబులును। బాహులనుతపీత భాతిజేతులన। మాహితలీల రుద్రా క్షముల్ దాల్చి। కాలిపచ్చడములు కావిదువ్వట్లు। తావిమాంజిష్ఠ ఖండం పుదోఫులును। దనరారుబల్లడ దట్టిపచ్చడము। లును రత్నకంబళ్లును వెలిపోత్తు। పచ్చడములు జారపడములుగట్టు। పచ్చడములు వెలిపట్టుపై బెట్టు। మలయునుప్పరము నంచులపటికంపు। వలయముల్ రుద్రాక్ష వల యముల్ మీాద। కలకముల్ మీావట కంచుగుబ్బలును। గెలకలచంద్ర సూర్యులుగల్గుబీర। మకుటముల్ గంబళి మకుటముల్ నంది। మకుటము బులితోలు మకుటముల్ గంగు। మకుటముల్ రుద్రాక్ష మకుటముల్ రాగి। మకుటముల్ నపంత్స మకుటముల్ సోగ॥ తత్పరంబులుబోడ తత్ప రంబులును। లొప్పుతత్పరములు కొమరొప్పదాల్చి। శుద్ధసువర్ణ సన్ను తప్రసిద్ధ। శుద్ధస్ఫటిక పరిశుద్ధకుండలములు। మందితరుద్రాక్ష మణి హేమరజిత। కుండలంబులు రాగికుండలంబులును। నందికుండలములు నాగకుండలము। లంద మైకణ్ణంబు నందుజెల్వార। బలుపన్నెబెత్తముల్

వలియబెత్తములును। వలయంపుబెత్తముల్ మలకబెత్తములు। కక్కుబె
త్తంబులు గాఁడిబెత్తములు। చక్కనివెదురు పొంజాయబెత్తములు। సైర
ణ్ణోలలు చందనంబులును। గైరంపుబాకులు కనపదండములు। ననుసు
లక్ష్ణోలలు ననుసులమొగడ। లనుసులసందుల జనులాకులములు। జలపోస
నముల మీఁదులవిలాసములు। కలశముల్ పట్టి కుచ్చులుజిత్తరవులు। కడు
సొంగమగువెలి గొడుగులుపీలి। గొడుగులుముత్యాల గొడుగులుజీబు।
గొడుగులువెలిపట్టు గొడుగులుమోపు। గొడుగులునిడితోడ గుడ్డలేతెర।
కళుకులుజితిముల్ కమలముల్బంధ। ములు నందులుచుగూడ జలపో
సనములు। కరమొప్పు రేకుల గద్దెనగరులు। పరిగామసజ్జల సజ్జనగరులును।
అనువుగద్దెనగరు లంగసోంకులును। ఘనకరతలముల గద్దెనగరులు। చెలు
వారుపట్టు కుచ్చులశివసూత్రి। ములును వెండిపసిండి గొలుసులునమర।
నుస్ఫిరనియతి గరస్థలంబులును। రస్థలంబుల నకతుస్థలంబులను। నాభిస్థ
లముల కంధరదేశములశి। రోభాగములభక్తి రూఢిదలిర్ప। పాయనిలిం
గసంబంధనిష్ఠాన। పాయతత్వములు సంప్రాప్తిగాజేసి। ప్రభుశక్తిత్రిభు
వన పావనోద్యుక్తి। శుభదైకవృత్తి విఖ్యాతమహాయుక్తి। గనిపరిష
త్కోటి గనిభక్తిమొప్పిక్క। జనుదెంచుమకుటవర్ధనజంగనుంబు। రాగి
కుండలములు రాగినందులును। రాగినూలులుదొడ్డ రాగికంట్లెలును।
రాగియుంగరములు రాగిదండలును। రాగిజన్నిదములు రాగియుత్తరలు।
వలుదకొక్కెంరలు బాలెలుతామ్రఖటన। వెలకొనుసరిఫణిల్ నేవళంబు
లును। కీలుకొల్కులరాగి। కీర్తిముఖములు। గాప్రిలుసందులరాగి। కట
కముల్ రాగి। పదకంబులును తాంమ్ర బంధబంధురస। ముఁతప్రభలనొ
ప్పు నొడ్డియాణములు। పటితరామలిన సంపదనొప్పుదొడ్డ। కటిసూత్రి
ములనొప్పు కౌపీనములును। అలదినగుల్భాంత మగుభూతికిరిందు। నలి
తనిజకాంతి జనుపరాబ్ధములు। నఖనికరాంశులు నయనదీధితులు।
ముఖవిలాసములు సముద్ధతకళలు। విశవభస్మోద్ధూళత శరీరములును।
దశనద్యుతులు దిశాతటములముంప। పుట్టమీసములును పెట్టినచిట్టి
చిట్టివజ్జల్లులు సితచామరములు। ననుసులగలశముల మరునాకులను
లును జవితొల్కబంళుల గద్దియలును। ధరచోద్యముగ గరస్థలము।

మీఁద। వరుసజుట్టినబహు వన్నెవస్త్రములు। మెల్లసినడుపులు మృదు
భాషణములు। వల్లభత్వములు చిత్తోల్లాసమునను। భక్తిశృంగారముల్
పరిభుతశక్తు లనఁ వి। రక్తిభావములు నారాధ్యసంపదలు। జనమనోహార
మగు శాసనమహిమ। లొనరారులాంచనంబులునైజముగను। మాను
గానొక్కొక్కటి మండలియనగ। బూనియంతయు జగత్పూజ్యతదనఁ।
నభిరమ్యలీల దుల్కాడంగనిట్టి। లుభయజంగమకోటు లొక్కటనడువ॥

### వృద్ధతపోధనులనడకలు.

చనలేకకాళ్లీడ్వ నగమట్టలువిడి। సినభాతిలగుగూడ చెప్పుటట్టలును।
కుట్టినగుడ్డల గోరుపడంబులును। కట్టునదిపాత కచ్చడంబులును। చిం
కిగొడుగులు గుర్సినశరీరములు। తెంపిజన్నిదములు త్రెరిలునుజాల।
వంగినవీపులు వడకెడుతలలు। ధంగురంబుగభారికు పట్టెడుపళ్లు। అడి
యంగవీపుల నంటుకొన్నట్టి। కడుపులుబెడతల బడినకన్నులును। తెల్ల
గానరసిన యుల్లిగెడ్డలు। కురిళ్ళనకుళ్ళనుక్క సీల్లుదగ్గుటలు। సురిక్కి
ళ్ళుకొన్నట్టి పుక్కిళ్ళవయను। వెక్కిళ్ళజరముల తక్కిళ్ళఘర్మ। జలము
లచమరు పూతలుగట్టీనట్టి। లందినతొంటి సర్వాంగభూతులును। అలరు
దద్భూతిమై నన్నికందువల। పోలుపారుచారుదిరి పుండ్రిరేఖలును। వడి
వెన్కసంబులునుదిచివైభుడును।తొడివేరిలుచేతులయడవేరిలుజడలు।భూ
తిపాత్రింబులు। భుజనగపతులు। ఖ్యాతమైయొప్పెడు కామసజ్జులును।
నూతంతయనకాళ్లు నొడలులుదూల। నూతలుగానిండ యూతకోలలు
ను। కడుసాంగములు జగత్కారణార్ధములు। నదరనిట్లుదయంచి య
ధితరూపముల। మహిసర్వతీర్థ సమాహితోయనుట। సహజమైతనరు
శ్రీశైలంబుమీఁద। నరసరతీర్థముల్ జరియించునట్లు। పారిబారివృద్ధత

### మిండజంగములనడకలు.

పోధనుల్ నడువ। మిక్కిలికట్టముల్ మేలిచందనపు। చెక్కలునలనత్రి
చిక్కణంబులును। కస్తూరిమొదలుగా గల్గునుగధ। వస్తువులునుగూడ
వాసించినట్టి। కరమొప్పుబాగాల కైరావళులు। కరటరుసున్నపు। కర
టలునిడిన। యడపతిత్తులుమూపు లందుధరించు। సడిసనుసంబెళల్ సం
కలనిదికి। తొడిదొడియాకులు తుడిచియచ్చుచును। వడువకగుడ్డలు వెను

కొనితేర। గీలించిపసిడి కొక్కెములనుగూళ్ల। గ్రాలురుద్రాక్షంపు కం
ఠమాలికలు। ధవళాంబరంబులు దనువులనమర। కవలయ్యుపానుపుల
గ్రాల్పులిగోళ్ళు। చెప్పులునడపుల యొప్పులుకీలు। కొప్పులుమాట్కల
నొప్పులునోసలి। తిలకముతోంటి ముత్తియములనూళ్ళు। కోలదిచాకట్ల
పోగులురుద్రసరులు। వరలునానాముఖ చిరిణంభుబసములు। నెరిభక్త
లకుమాట వలపకుండుటలు। బగుతుల చేత బాపగనిచ్చినట్టు। తగిలిధట్టిం
చి యర్థములుదెచ్చుటలు। రారోరిభక్త తేరాలంజకనుచు। నారంగ
వ్రియమున కడిగి తెచ్చుటలు। బసవన్న కరుణ రాబగతమీరనుచు। ఆన
మిచ్చును ధనంబడిగి తెచ్చుటలు। కలియుగబసవదలిలనీవయనుచు। నల
రించిభక్తుల నడిగి తెచ్చుటలు। ప్రకటంబుగవచ్చు ఫణ్యాంగనలను।
కెరగంటజూచుచు గెలిసేయుచును। సరసరపుష్పమంజరుల వైచుటలు।
చెరలాడుటంవారి జేరబిల్చుటలు। వేలంబులడుకుచు వెరకనేగుటలు।
నాలోలమతివీడి యంబులిచ్చుటలు। మెండాటములనట్ల మెరయలో
మాల। దండములుగురివెరు దండలునమర। దరసహారుచులు నుద్దండము
ల్ తగిన। వరభూషణావళుల్ వాలికగోళ్ళు। వివిధవిచిత్ర నవీనవస్త్ర
ముల। నవధరించినలింగ నివహంపుహొయలు। దొలుకాడుద్గృగ్ధితులు
దంతధావ। నలునిజదేహద్యుతులు సాంగముగను। పరిశీలిని దేశాధిపతు
లభావమున। ధృతిపేర్మినితరుల ధిక్కరింపుచును। నంధిల్లలిటవేష సహ
జమదాంధ। గంధసింధురముల గతిమలయుచును। భూమగోనాదులపోలు
పునవెదరి। గాముకులుమగని కాలుద్రివ్వుచును। పొనరుకస్తురి మృగం
బులపోలుపునను। జనులకు దేహ వాసనలొసంగుచును। దేవదేవేశుభో
గావతారముల। భావనభక్తుల ప్రాణేశులనగ। తనమనోధనము లాద
టహరింపుచును। సనుషక్తలింగ నిరంతరసాన। ధ్యానతత్పరతమై తత్ప్ర
సాదవ్రీ। లీనభోగోప భోగానందసౌఖ్య। మంకితసకల సమగ్రత మెరసి।
మిండజంగమకోట్లు మెల్లనేనడువ। పలకనావలనేత పట్టైలుసూర్ణి।

## శీలవంతులనడకలు.

పొలుపారుపాదరక్షలుభాతిమెట్ట। ముసిగిడిపస్త్రింబు ముందటిజనుల। కె
నలమాడెడితొత్రప కెంతయుదొలగి। భావించిముందట। భక్తులనగ।

దాపెన్కవారి పాదములుజూచుచును। నలినభక్తాలోక నాచ్ఛైవయనగ
వలిబదార్థని వివర్జ మెత్తనగ। బొలుచు రేఖలులేని బోనపుభాండ।
ములు విన్నచట్టువంబులు నిదిమీాద। చుట్లనుగవసెనల్ జట్టిన బోన।
పుట్టికల్ సంధించి సట్టికావళ్ళు। పలకలనేర నేర్పడనపదార్థ। ములచెం।
చులును మోర్లుగలఋసపమొలలు। ఎడిబెట్లు వస్త్రముల్ వంశపాత్రి
ములు। తడిమొత్తు వస్త్రముల్ దగినగుగ్గులము। సంచులును। విభూతిసం
చులు మృగ్గు। సంచులారతపిండి సంచులునాడు। గోళ్ళుదింగ నుదు
ళ్ళుపాదముల। గోళ్ళయుప్పించులునులుగోడగండ్లు। కలయంగమేల్కట్టి
గట్టడిశస్త్రములు దెరచీరలు మునునాదిగాంగ। నతిసువిధానంబు
లగునుపకరణ। తతులుకట్లవుడెడ్లు తమతోడసదువ। ననసులుచెట్టున
యలతిలాకులము। లొనరంగదాల్చి వరితోద్యక్తినమరు। వేషముల్
భక్తి సుభావములనిత్య। భావలునవియ విభూషణములుగ। గాంతురుపాని
ణేశు గానసుజగము। చింత్రింతురాత్మేశు జంతింపరొండు। మరియుబం
చాక్షరీ మంత్రింబుగాని। మఱియునుదలపరు మాత్రింబులొండు। దల
తురుపాణేశ దలపరణ్యంబు। వలతురుభక్తికి వలువరొంటికిని। పలుకు
దురన్నట్లు పలుకరుబొంకు। లుకుదురొడ యులకలకరన్యులకు। నడు
తురాచారంబు నడువరనీతి। విడుతురుదైన్యంబు విడువరుచలము। కొం
డుప్రసాదంబు గొనరనర్పితము। విందురుభక్తులకీర్తి వినరొండుకీర్తి।
యిప్పాటసజ్జనులెల్లనుతింప। తప్పకసద్భక్తదాసదానియతి। నన్నుతిశుచి
తినుతాచారసంపత్తి। జెన్నారజనుదెంచు శీలవంతులును। పరమశాం

## విరక్తులనడక.

తత్వంబు భసితంబులెనయ। పొరిబారిసర్వాంగముల జూసికొనుచు।
శమితేంద్రియావి విషయములకచ్చ। డములను వీడకుండగగట్టికొనుచు।
పంచాక్షరంబులు పరహితాలాప। సంచితాక్షరములు జపముసేయు
చును। అమరలాకులములు సంతర్పుశేంద్రి। యములునేపొద్దు బాయ
కధరించుచును। తోలుకాదుపరమ సంతుష్టచరిత్రి। ములు మొలచుట్టు
మొగిజుట్టుకొనుచు। తత్వనిస్వనమయోత్సాహంబుకంత। కుప్పసంబున
గెన గూడదాల్చుచును। నిరశనభిక్షునివృత్రియామృతము। తరినీశ్వరుస

కల్పితముజేసికొనుచు। యమనియమాది వ్రతాహ్లాదులగుచు। శమ
దమాన్విత సదాచారవర్తనులు। సచలితపరమ పరమపరానందలీల
బచరించుచు బహులవిభ్రాంతులై పొగడ। తనుధర్మములుద్రింపతపములు
బెంప। మనసులుమర్దింప మదములువింప। క్రోధంబడంగింప కోర్కు
లుడింప। బాపముల్ హరియింప భక్తిమెప్పింప। మునుజగంబులలోన
ముక్తులుబూన్ప। ఘనతరంబుగదాన కారణంబైన। యవిరళలింగార్చ
నానుషక్తియును। సవిశేషజంగమా సక్తియుక్తియును। సతతలింగాస
మర్పితవిరక్తియును। ధృతినొప్పు భవవిరక్తియుబ్రాణమైః। తనుగాం
చినసద్భక్తి దమగొనియాడ। రమణనేతెంచు విరక్తిజంగమము॥ బాహు

శివయోగులనడకలు.

తలంబుల ఫాలంబులనుస। మాహితహలతోరణాంబుజమత్స్య। కలశ
దంబోళి శంఖశత్రిపుఖ్య। విలసితపుణ్య రేఖలుబొలుపార। నయనాబ్జ
రుచులునున్నత నాశికములు। ప్రియమతాలాపముల్ పృథుజఘనములు।
జారుభుజములుగ శాలవక్షములు। సారసంస్మిత ముఖాబ్జములుగొంవరటి।
సరసాంగగళలు నాజానుబాహులుచు। కర మొప్పుశ్రీకార కలితకర్ణ
ములు। కృతులకు దేధి సతులకుభక్తి। మతులకుశివయోగ సతులకు
నొప్పు. మినమతాఖిల శుభాస్వతేచ్ఛణాంక। వినుతావయవరాజి విం
డియునమర। మలినదర్పణములు మాడ్కి జీమూత ములలోనిచ ద్రిల
సొలుపునమెరయ। కాలియురూపణంగ నితాళ్ళపగిడి। నోలిదేహము
లులో కాలికిజూడ। గలిగియుసహజ సంగతగుణావళియు। గలుగని సీర
సాంగములువపంచి। యతిశయఖండంబు లగుఖడలుడిగి। ప్రీతినఖండ
తదిగంబరధరులగుచు। కామితపరదేశి కత్వంబులుడిగి। గాఢమైకవాస
సంగతచర్యులగుచు। యాచితభిక్షంబు లనుభవించుచును। యాచిత
కామ కృతాహారులగుచు। బహుజనోపాశ్య ప్రపంచంబులుడిగి। సహ
జగుహాపాస్య సంగతులగుచు। లోకాంతగోష్ఠివిలోలతలుడిగి। యే
కాంతగోష్ఠి మహిష్ఠితులగుచు। వరసుఖార్థ శిరోజ వ్యసనములుడిగి।
సరిముక్తకేశ మస్తకధరులగుచు। నారనకామ కామ్యాదులుడిగి।
వైరాగ్యసంసార వర్జితులగుచు। తరమిడివిధిని షేధక్రియల్ లేమి। పరి

చితోభయకర్మ పరిహారులగుచు। హఠయోగరాజ యోగాదివిభ్రాంతి। పటిపగుపశు యోగబంధంబులేమి। నవిరతనిరత శయానంద హేతు। పవునిత్యశివయోగ వివశాత్ములగుచు। తానును నిదురు నింతయుచు నస్తుతియు। మానావమానముల్ మరియూరునడవి। చలియునుష్ణంబు విషమ్మమృతంబు। వలపునొల్లమియల్ల వనితబుడల్లి।చుట్టలుబగుతుబు సుఖమునుఖ్ఖంబు। పట్టెమచంమునేల బసిడియుబెంచు। సమమకాని ద్వంద్వశమితసంసార। సముదితశివయోగ సౌఖ్యమగ్నతల। నంగంబు లును లింగమైయంగలింగ। నంగతిబాణంబు సరిబాణలింగ। సంగతి మనసుభావ్వసమ్మనోమార్గ। సంగతిదృష్ఠులా లింగైకదృష్ఠి॥ నడగన మస్తేంద్రి యములునుమనసు। నడగునవ్వేంద్రి యాణాంసయనంప్ర ధానంబనగసంత్రతను ధర్మములవి। లీనంబులగుబాణ లింగంబునందు। గానదల్లింగిత ంగతాదష్ఠి। భువిబిద్దానంబుతను ధర్మవానతదనరు। తను ధర్మహితత దనరుసద్భక్తి। ఘనభక్తిశివుకృప గలుగుగావునను। తివియ శవీక్షించ్చు దృష్ఠకుహేతు। దవుగరస్థలమసింహాసనంబుగను। మణతది యగరస్థలలింగ। సమనిరీక్షణ నిత్యసంగతినిట్లు। వెలిమూ సదృష్ఠులు వీక్షించుజగము। తలపదృష్ఠులజూచు దన్నునుమరచి। యున్ననిక్కపు శివయోగులదవుల। గంన్నతటన మొక్కు। ఘనతరానక్తి। శివునిలోగా యంబు శివునాత్మలోన। శివునిలో బాణంబు శివుమదిలోన। శివునిలో ంద్రియ। వివిధవర్తనల। శివునిజత్తములోన। శివులోసదృష్ఠి। యు యుక్తంబుకాయజ యోగేసయనబ్రి। యుక్తిగూచర్చ ట శివయోగం బుగాన। శివశాసనస్థులు శివయోగరతులు। శివమంత్రసిద్ధులు శివయో గరతులు। శివపరిజ్ఞానులు శివయోగరతులు। శివతత్వవేత్తలు శివయో గరతులు। శివధర్మతత్పరుల్ శివయోగరతులు। శివసధ్యానులు శివయో గరతులు। శివపధారాధకుల్ శివయోగరతులు। శివభక్తిముక్తులు శివ యోగరతులు। శివశరణాగతుల్ శివయోగరతులు। శివుప్రసాదాప్తులు శివయోగరతులు। గాకయుద్వైత సంగతినదిదాన। గా కేమియనుచెల్ల

గాకుగానీకె। జీవుండుశివుడండ్రి శివయోగరతులు। శైవావిహీను శివ
యోగరతులు। దైవనాస్తికులె యుత్తమయోగరతులు। భావశూన్యులె
పరాపరయోగరతులు। అద్వైతబుద్ధులే హరయోగమతులు। సద్విధిభ
ష్టె యీశ్వరయోగరతులు। పశుయోగులేపశుపతియోగమతులు। సశి
వేతరులె మహేశ్వరయోగరతులు। యొనరవియోగసంయోగంబులఁగ।
జనుమాటలైనను జర్చించిచూడ। నొగిరెంటుకూటము యోగము
రెండు। నొగినాస్తియనుటిది యోగమోరెండు। నొగియొక్కటైనయు
న్కి యోగమోకాక। యొగిసందోకడులేమి యోగమోతలప। సిద్ధాంత
పక్ష సంచితశివయోగ॥ సిద్ధియన్యులకేలసిద్ధించుదలప। శివయోగినేయని
చెప్పదిగాన। శివుడుదానేగు దెంచెనుకాకయనగ। నిమిషయ్యయేయి
న్ని యంగములఁ దాల్చి। చెనసిశ్రీగిరికి వచ్చెనోకాకయనగ। సజగణదే
వుఁడీ యవతారమునను। భజియి పవచ్చెనో పర్వతనాధు। రమణయ్య
ముగసిద్ధరాముడిగ్గిరికి। నముదితగతినిట్లు। చనుదెంచెనొక్క భృంగీశ్వ
రుండిట్లు పెక్కురూపములఁ। నంగదశ్రీగిరి కనివచ్చెనొక్క। యపమన్యు
గురు వసిష్ఠపవిత్రపాణి। కపిలభృగుకణ్వాద గౌతమాగస్త్య। శుకవామ
దేవ శౌనకప్రరోగముని। నికరంబుమీయూర్తి నికరముల్ దాల్చి॥ శక
మర్త్యమర్త్యలోకంపుభక్తులను। సిరిగిరిజూడ జెచ్చెరవచ్చిరొక్క।
భువిచోద్యమంచు నద్భుతముదలిర్ప। శివయోగులను బుధశ్రేణిగీర్తింప।
నొగిదర్శనాచ్ఛివ యోగినోయనగ। తగిలిదర్శించు ధన్యోత్తము
లకు। ననుకీర్తి నర్వార్థాభిషేకభ్య యనదమతోమాట లాడుబుణ్యు
లకు। మొదలగంగాస్నాన ముఖ్యసమస్త। విదితతీర్థస్నాన విపులఫ
లాదు। లొనగు మనసమ సముల్లాసమహిమ। లెసగుచుశివయోగు లెల

అభ్యాసయోగులనడకలు.

మినేతేర మలకరవాలు దామడమలనెత్తి। తెలిగాదిపాపవా తెరల
బూజించి। తనుదంమ్మిదొంతుల తలవంపులుడిసిసనబవడంపు పుగోనలు
ముద్రించి।జంట వెలుగుమాన్పికుంటెనల్ సిక్క।వింటి వెంటనుమింటిజంట
కునెయిది। వెంన్నెసవి వెన్నె పెన్నెలల్ జూపి। మిన్నెదిదాపల మీఁదియుద్ద

సి। వడదోవనిడి తలవాకిలినెక్క॥ బడినిర తర వరాభ్యాసపక్వముల।
లరునాకుంచ నాయతవాయుపూర్తిని। జలకనై దేహముల్ జొక్కా
కలట్ల। యొక్కింతయిలయోచి యునుమోనకువికి। దొక్కినయరజలు
గొంపకుండుటలు। భంగిగాదివ్య పరిభావటలముల। సంగతిజిక్కు పతం
గంబులట్లు। వడరుచక్షుగోళ కాభ్యంతరమున। ముడివడయంతన
ముదితవిజ్ఞాన। కలితదీపప్రభాగారంబుసొచ్చి। వెలుపలగానని వీక్షణం
బులును। నగపడినిజభుక్తి యానమైవలల। దగిలినమత్స్య వీతానంబులట్ల।
ముంచినఖేచరీ ముద్రానుగతన। మంచితామృతభక్తి నడగుజిహ్వలును।
లోలవృత్తి దాదామృతంబాని। యోలిధమ్మెరుగని యురగంబులట్ల।
చచితానాహత వివిధనాధముల। మరిగియుండెరుగని మహితకర్ణ
ములు। పరిచరించుచన్వక పరిసవసౌరభము। పస కేంగిమడిసిన భ్రమరం
బులట్లు। వ్యాపితాంతయోగ వాసనానియతి। వ్యాపించుచున్నట్టి వర
నాసికములు। కరణీసుసంయోగ కలితసౌఖ్యమున। ధరగట్టిపడిన మాతం
గసంఘములు। చాలిప్రాణాహీన సంయోగసుఖప। శాలతజనిన యాన
త్వంద్రియముల। పొంగిమాతంగ పతంగభుజంగ। భృంగమత్స్యాదుల
గంగినొక్కక్క। విషయంబులైచెడ విజయుడైయుల్ల। విషయపంచక
ఖ విభ్రాంతులుడిగి। శివపదధ్యాన నిశ్చేష్టితావస్థ। నవికలవిషయేంద్రి
యంబులనరసి। హరునినంతర్బహిర్వ్యాగసత్క్రియల।నరుదుగాజడసియు
హర్తాసిద్ధి। క్షితిత్రిదిలోకయానిచిహ్నానియనగ। ధృతితానిచిహ్నని
వేతోయనగ। నందస్థలగు చిహ్నలలిసూక్ష్మభాతి। పిండస్థమైనమభి
నసృష్టి। యుర్వీజలాగ్ని వాయువ్యోమవితతి। సర్వపర్వతనదీ సాగర
వ। భువనతారాగ్రహనివహాదులాత్మ। భవనంబులనగాన బడునందు

## శ్వాసలలక్షణం.

న। చంద్రుడిడానాడి నవ్యభాగమున। సాంద్రషోడశకలాహితమై
యుండు। నాదిపింగళనాడి నాదిత్యుడుండు। ద్వాదశకళలతో దక్షిణం
బునను। లీలసూర్యేందు నాడిప్రచార్యాను। పాలనంబైయుండు పంచ
భూతములు। అందుదూర్పున మీదునలతత్వంబు। క్రిందుదాజలతత్వ
ముందుపశ్చిమము। నరయులోగమ్మి యుత్తరమదిపృధివి। యిరువాట

ములవాయు విలదక్షిణమున। నడుమాక సంబిట్లు నాదియుగమున। యొక్క
పకభూతంబు లేనువత్రిశంప। వరుసనర్వదిని శ్వాసముల్ బ్రాణ। మగ
యదడ్ప్రాణంబు లారొక్కడియ। యొక్కొక్కగడియ కొక్కగఘూశ
వేళ। చక్కనసూర్యుండు జందుంద్రిండునడవ! యడరయొక్కొకనాడి
యంద్రైదుజేసి। ఘడియలైచనునైదు గడియలుగూడ। నదియత్రాక
లగ్న మ్మట్టులగ్నంబు। నొదవంగపండ్రెండు నొకదినంబందు। పెరసియి
ర్వదియొక్క వేయునన్నూరు। స్వరమఃలాస్వరములుసంవత్సరంబు
గడియలైచనునట్టి గడియలర్వాంటి। వడిచాలుగొనగను వచ్చులబ్ధముల
దినములాదినములు దివుటబండ్రెండు। మనసిదిబాల్గొన్న మాసంబుల
గును। నడిసనునట్టి మాసధృవపోక్తి। నడచునాదినవార నక్షత్రయోగ
కరణగ్రహణ పురోగమకాలచక్ర। సరణియుస్వరచక్ర సరణినేకముగ
యినశశిపక్షంబు దినశశిదిధులు। యినశశిపరిహారంబు వినశశిఘటిక
యినశశిగ్రహములు హితమైననాడ్లు। జనునిషామృత సమస్వరసంగమ
ములు। హానివృద్ధులునురు జాముజాములును। మానావమానముల్ న్యూ
నాధికములు। నతులజయాప జయాలాపలాభ। గతులుకాలజ్ఞాన కాల
వంచనలు। కలితహృత్పద్వ్యాపకంఠదీపాఢ్య। దళజీవహంససంధానఫల
ములు। ననయుంబునాత్మోదయంబందకాంచు। ననుభవసిద్ధియు నాత్మ
సిద్ధియును। వరఫలితచ్ఛవివర్జితాంగములు। సురుచిరాకారముల్ సుకు
మారములును। యమనియమాదులు నణిమాదిసిద్ధు। లమరుఃశప్రత్యే
యములుసాంగముగ। చరితలుజిందులు। ఔషధుల్ యోగ। పరిభావల
ల్లన సాదుచుమంది। బెత జేరకే కొంతపక్షములు। సత ంతనచుచ నళ్ళ

## పుణ్యాంగనలనడకలు.

నయోగులును। కుగునేరికట్టముల్ గొంకులక్రింద। చెరుగులనొడ
చుల్ల జిక్కినిండి చి। జేలువగుబైసంఘుచెప్పులుమెట్టి। పలచనిజోల్లుకు
ప్పసములుబూని। పదపడియలగిదుప్పట్లకొంగెడలు। వదలకుండగమీద
వల్లరుల్సుట్టి। తొడవులునిజత నుద్యుతులకుమాట। పడునసియాత్మలో
భావించితొడక। మొదలిమంగళసూత్రమున దాల్చినట్లు। పోదలుమంగళ
సూత్రములుధరియించి। అలసియునలయని యట్లనాపలును। బిలిబిలిల

వుల బిగువుచూపుచును। కొమరుదలిర్ప నెక్కుళ్లడిగ్గుడ్లు। దమతమపతుల హస్తములూదికొనుచు। కరిముప్పతిలినవికంబులచమట। కరతలాంగుళములగమిచివైచుచును। చందనాదిశ్చ్మాజిచలితసంభూత। మందానిలంబు చేమతులు దేలుచును। గాళ్లితుమ్మెదల రెక్కలువీంక దాకి। రాలుపుప్పొడిగి శిరంబులొగ్గుచును। చూతవటాదుల జొంపముల్ గన్మ। శీతలచ్ఛాయల జిక్కగోరుచును। ప్రసూనమరబహు వివిధపరిసవసౌరభ్య। లసితవాసనడి కుల్లములుజొన్పుచును। బింబాధరంబుల బీటలడంగ। తాంబూలసారామృతములదడపుచు। వదనపద్మంబులు వాడకుండంగ। బొదవిడవిర్చులే బొదలడ్డమిడుచు। కరతలంబులను రక్తములూరకుండ। కరతలంబురోజ్లు గదియించుకొనుచు। బిగిసిపెంపొడలు బాంపిరిరాయకుండ। నాగిరాజహంస లట్లొయ్యనబునుచు। నుల్లంబులునుగ మనోపతాపములు॥ మల్లడిగొనకుండ మల్లయాయనుచు। పటితరధర సముత్కటనిదాఘాగ్ని। చిటులుగొనకయుండ సిరిగిరియనుచు। సౌరిబొరినికిరియపురుషులుదారు॥ సెరమిపుణ్యాంగ నాసికరమే తేర॥ చుక్కలుబొట్లును

## జోగులనడకలు.

చిక్కవెంట్రుకలు। జక్కనిపాటలు జంగాళములును। యినుపనేవళములు యిత్తడిసరిగ। లును వెంట్రుకల దండలును దగరంపు। బిల్లాండ్లుమట్టెలు బెక్కువన్నియల। డొల్లుకుప్పసములు వల్లగాజులును। కలయంగజెవుల సంకుంపుబూసలును। వలుబూసపేరుల బన్నసరములు। కుటుబంపుకన్నులు కొయ్యగాటికలు। పటుకెంపుముక్కెరల్ భారమైతనర। చిలుకలదుప్పుల నెలుకలనేడు। కలగాళ్లితులనుచిచ్చు కలగొరనంక। నక్కలనుడుతల నెమళులబంది। కొక్కులగొల్లను కుక్కకూనలును। సింగిరికుక్కల వేండ్లముంగిసలనుని। జాంగనల్గొనిమెన్క నరుగుదేరగను। పలువంన్నెకోక బొంతలనట్టనడిమి। తోలుకప్పసములు దూర్చినమెడలు। వినవుహూపులబూజు వెంట్రుకల్ నెడద। నొసలియిట్టికబొట్టు। పనవులుగన్ను। గవకాటికలుదరుద కాయకప్పెరలు। చెవులపింకెలు మొరచెడిబోదముద్దు। చాంకిటితిత్తులు చక్రిముల్విడుద। తోకకచ్ఛడములు వాంకబొట్టలును। యొడురోమ్ములుఖాడ యూరులుబిగువు। యొడ్డాణములు

నిన్నయుంగఘముఖు। కడియముల్ మురువులు గరచేతులును। గొడుగులు గుడియలు కోకజల్లెడలు। వద్దు మొగంబులు వలిపెంపుజెముక। బద్దెల గూర్చిన పచ్చడంబులును। మురిపె వునడుపులు మూపుతిత్తులును। విరనంపుమాటలు వికృతవేషములు। పల్లమీసంబులు పరికెగడ్డములు। నల్లమేనులుగుబ్బ నారసంబులును। అరిమురితనములు హంకవైచుటలు। కరకత్రాళ్లు వలెంట్లు గడుసాంగముగను। పనుగొనదముజూచి భవులుభవులన। పెనుశీలవంతులు బెట్టుసత్రములు। నొక్కొక్కలింగంబు నొగి జూడగున్న। నక్కడజారగ నీసైలయనుచు। గళములగద్దె నగరుబదోపంగ। నలరుచుభుక్త్యర్థమైధరియించి। జోగిణీలునువారు జోగివేషములు। జోగులుగొలువంగ జోగులేతేర॥ వ్రేళ్ళునులేనరి కాళ్ళునుపిల్ల

పిచ్చ్యుదుంట్లనడకలు.

వ్రేళ్ళుపెక్కానరి కాళ్ళునమట్టి। కాళ్లునుమోట మోరికాళ్ళునుదోలు। కాడ్లునుమెండిన కాడ్లునుమలక। కాళ్ళీచవోయిన కాళ్లునుగుజ్జ। పిరుదుదులునెండిన పరుదులునోదురు। పిరుదులునొంటూంటి పిరుదులుబల్ల। చేతులులో వంక చేతులు తోలు। చేతులు నొంటొంటిచేతులుచాల। కురుచచేతులురొమ్ము కొరదులువీంపు। బోరదులువిరిగిన భుజములువందు। వెడగుబొందులును పొడవైనమక్కి। మెడలునుకడుగడు నిడుదమూపులును। ముడుగుమోములు మురుముండెముల్ బండి। బెడగురూపంబులు పెడగులోసొట్ట। లటుకిందుడప్ప మీదంతయునొప్పి। పటురూపసౌందర్య భావాతిశయత। బరగుదేహంబులు బాట్లోనల్ల। తమజులునాప్తులు తముజూచిబత్రితుక। గళములలింగంపు గద్దెనగరులు। నలతివిభూతి రుద్రాక్షలువలుద। మకుటముల్ గోహళుల్ మరివేలు జడలు। ఏకటితంబుగదాల్ప బడిదీనవృత్తి। గనుగొననిన్నచీదులగట్టియున్న। మొనుపోతులునుగుజ్జు టెద్దులనెక్కి। తమిజగత్పావన। సత్వామ నివ్వాటల్ల। నమరుదృష్టను గరుణావృత్తియొదువ। పదపడియాక్రియ బల్ల వలెనడచి। వెదకుచుమాపటి వేలముల్ జేరి। చనజనముందట వెనుకను తోడి। జన్నులెల్లకారఁ మొనంగరాయనుచు। సేలయామెవ్వరి నిందులో

కరుణ। మాలింటియనక్కటా యనుచుమాయట్టి। దీనులమరియొక దేశం
బులకును। బోనీకవృత్తులు భూములుగవ్య। దానములుహిరణ్య దాన
ముల్ నవ్ర్త్ర। దానముల్ మరియన్న దానంబులెక్క। పోతుల నేడ్లను
బోలుగనిచ్చు। దాతమాజనసన దండనాయకుని భూమిలోబోలెడి
స్వామిబగుతుండు। దామరియొకడు లేదామల్లినాథ। తార మొనంగ
శేషధర్మాత్ములార। రాగోయనుచు మమ్ముజేరంగబిలిచి। యేలయాయ
డ్లలో నివ్వనేకరుణ। మాలించియక్కటా యనుచుమాయట్టి। దీనుల
కునుగృ హోదానంబుభూమి। దానంబులభిమత దానంబులిచ్చు। సిరి
యాలసెట్టి। నీకరికాలచోడు। నరిముమరాజు నేణాదినాథయ్య। చేంమ
మరాజయ్య సింధుబల్లహుని। వేరచోడనికరయూరిబోడనిని॥ శివలింగదే
వుని సిద్ధరామునిని। నవరదనాచయ్య సామవేదులను। భూమిలోబో
లెడు స్వామిభక్తుండు। దామరియొకడు లెడామల్లినాథ। పీవంగజే
తులు లేవయ్యనడచి। పోవంగ ళ్ళను లేవయ్యయంధ। కులమయ్య
పిచ్చుక గుంటులమయ్య। తలపంగనభ్యాగతులమునుండయ్య॥ అగపడ్డ
వెడగుల మగుమమ్ముబోవ। దగవగుజుండయ్య దయగల్గుడయ్య। పర
మమాహేశుండు బసవయ్యకరుణ। సిరిగిరినాథుని కరుణయామీకు।
సుంకరబంకయ్య సురియచౌడయ్య। శంకరదాసయ్య వెంకమంచయ్య।
దేవరదాసయ్య తెలుగుజొమ్మయ్య। బావూరిబ్రహ్మయ్య॥ బాచిరా
జయ్య। భూమిలోబోలెడి సామిబగుతుడు। దామరియొకడు లేడామల్లి
నాథ। యనుచుబాడంగ ముందరవెక్కదోడి। జనులెల్లదార మొనంగ
రాయనుచు। నితరధార్మికులనిల్లెచ్చుచుమరియు। బ్రీతిజూపుచునుభక్తి
పరులవేంఋచును। వచ్చుచుబరస బావనముసేయుచును। పిచ్చుకగుం

## చెంచుధర్మాత్ములునడకలు.

టుల పెల్లెగుదేర। నదియుంగదమతిమ గ్రామముల్ వెడలి। నదియాది
గామల్లికార్జునస్వామి। శ్రీపదాబ్జములు దర్శించుసంతకును। చూప
రబునుతింపుచునుగొనియాడ। భాగయ్యవెక్క శంభుడుమునుగన్న। భాగి
దియనట్లు భక్తిదవిర్ప। చెలగియంగ ప్రదక్షిణములునిడ్డ। జలుపుచుపా
రిబారి జనుదెంచువారు। నలరంగనడుగడు గశ్వమేధంపు। ఫలముని

జాంఘిరి సప్తకమంగమనుట। దనరుశ్రీశైల యాత్రాఫలంబునకు తను
వులేభువిమాన దండంబులుఁగను। డాయసాష్టాంగ దండప్రణామములు।
సేయుచుజెలగి చెచ్చెరంవచ్చువారు। కదియంగదమతమ గ్రామముల్ వె
డలి।నదియాదిగామల్లికార్జు నస్వామి।శ్రీపదబ్జములుదర్శించుసంతకును।
చూపరులు నుతింపుచుగోనియాడ। నాదిని గాహాకుడై పర్వతుండు। గాఢ
యిశ్వరుబొంద గాగాంచెననుచు। నిత్యోపదా సైక నిష్ఠాదికల్పు। సత్య
వ్రతోక్తిపై జనుదెంచువారు। గొడుగులుచెప్పులు కుంచెలుమంచి।
గడవసంబులునేత కర్పడంబులెను। కుప్పసంబులుకటి గుడ్డలుబోడ।
తప్పరంబులు కమండలువులుగద్దె। కంబండ్లుకప్పడి కంబళ్ళుగోవ్వ। దం
బులుయోగ దండములుదండియలు। పొత్తిపంచెలు కాతిత్తులునడప।
తిత్తులు నూనెసిద్దియలుయోగ। పట్టెలునారతి పలకలునాల। వట్టము
ల్సిబువుల పళ్లికల్వెదురు। సరుగులసంబెలల్ సానలుముగ్గు। పలకలు
దీపగంబముల్ విభూతి। పూసలు లుద్రాక్షములు పటికములు। గ్రాస
ఁంబులుగాని గద్దెనగర్ణ। శివసూత్రములు గవిసెనవస్త్రములును। వివి
ధోపకరణముల్ వివసకరంబును। గన్ధంపుజిప్పలు కరవడంబుల్లను। గం
దంపుచెక్కల కప్పడంబులును। మరియునునుచితాభి మతపదార్థ
ములు। పెరుకలకావళ్లు పంపొందదెచ్చి। యడిగిన చోటన యడిగినవారి।
కడిగినవస్తువు లర్థినిచ్చుచును। వలసినచోటన పలయువారలకు। వల
యుపదార్థముల్ వారికిచ్చుచును। అలసినచోటప యన్నపానాదు।
లలసినవారల కపుడయిచ్చుచును। చలిపందిరులు సత్రశాలలుగుండ్లు।
చెలమలునంతంత సేయుబంచుచును। నంతంతబందిరు లంతంతమరుగు।
లంతంతవిడిదల లనువుసేయుచును। భంగిగాజెంచు సద్భక్తివింమ్మాడి।
జంగమారాధనల్ సలుపుచునడువ॥ మరిబరిషత్కోటి మతులహ

## పరసవింగార్చన.

ర్షింప। తరిదరిపద పదార్థములునిచుచ్చును। యుదకంబులుదకంబు
లుదకంబులనుచు। నుదకముల్బోయుచు నొగివచ్చువారు। పుష్పముల్
పుష్పముల్ పుష్పంబులనుచు। పుష్పంబులిచ్చుచు బారివచ్చువారు।
కర్జెముల్కర్జెముల్ కర్జెంబులనుచు। కర్జెంబువిచ్చుచు గమకించువారు।

విడియముల్ విడియముల్ విడియంబులనుచు విడియంబువిచ్చుచు వెన వచ్చువారు। నడవజాలనివారి నడపించికొనుచు। యెడనెడనొయ్యన నే కెంచువారు। మరియునీకిరియ జంగమములు భక్తులును। దరితరి నేతేర తండతండములు। సనుసయించుచు గొనియాడుచువారి। కనురక్తి మొ క్కుచు నరుగుచున్నంత॥ ఆకొనిమధ్యాహ్న మగుడుసుబరన। వీకతో నొక్కొక్క వేలమాల్ గాంగ। సంతించుచు దరుచ్ఛాయలబాదలగొం దుచుదోవల గుహాలశైలములు। మరుగులగొండల మాటిలనదులు। కురు వలబిలముల గుడ్లమెత్తులును। చక్కనదసుతమ చక్కట్లవిడిసి। యొక్కొ క్కచరుల కెరియ్యాటలబాసల। బావులగుంటల పద్మాకరములు। వావిరి మోరల వరతబుగ్గలను। ఎరింతలనేరుల వాగుల సెలల। గురింతలజలముల కూపాదులందును। పొత్తిలంబుల పొకపొత్తులగల్ల। తిత్తులరాగిబిందెల చె దువులను। కుండలగలతేల గుళ్ళగోరలను। గిండులదొడ్డ కనుండలువులను। గరిగేలబటవల కాసడ్లుగూడ గరతిత్తులను నుదకంబులుగొనుచు। ఘన తరంబగుదేవ గందలిదవన। మునురుదరిజడ మర్వమున ఖండిబి.వ్వా। పత్తి రినావుల బత్తిరి మాచి। బత్తిరి నేరెడుబత్తిరి జమ్మి। బత్తిరి గాంచన పత్తిరి పచ్చ। పత్తిరి మారెడుపత్తిరి వెలగ। పత్తిరి వావిలిపత్తిరి దు మ్మిత్త। పత్తిరి గంన్నేరుపత్తిరి నెల్లి। పత్తిరి చిరినెల్లిపత్తిరి మునిడి పత్తిరి సోమెందపత్తిరి గోగు। పుష్పములు నశోకపుష్పముల్ పొగడ పుష్పముల్ గేదంగిపుష్పముల్ మల్లె। పుష్పముల్ సేమంతిపుష్పముల్ మొల్లె। పుష్పముల్ కరవీరపుష్పముల్ దుమ్మి। పుష్పముల్ జిల్లెడుపు ష్పముల్ రేల। పుష్పముల్ గురువిందపుష్పముల్ పొన్న। పుష్పముల్ నివాదిపుష్పముల్ మలక। పుష్పముల్ వాగొందిపుష్పముల్ జాజి। పుష్పముల్ దామెరపుష్పముల్ గంవ। పుష్పముల్ కింశుకపుష్పముల్ మరగి। పుష్పముల్ పుమ్మెత్తపుష్పముల్ గోరివి। పుష్పముల్ గుమ్ముడుపు ష్పముల్ గలివె। పుష్పముల్ తంగెడుపుష్పముల్ మూల్లు। పుష్పముల్ గాంచనపుష్పముల్ గెంటె। పుష్పముల్ మాలేడుపుష్పముల్ మంగ। పుష్పముల్ గోరింటపుష్పముల్ గొమ్మి। పుష్పముల్ చెంగల్వపుష్పము ల్ వెలగ। పుష్పముల్ మొల్లెదపుష్పముల్ గొనుచు। నొండొరుగడవంగ

నుద్వృత్తిజనియ। ఖండితమతినారఁబండిన రేగు। బళ్ళను మామిడిబళ్లను
యీడే బండ్లను నేరెడుబండ్లను మొదవి। బండ్లు ఖర్జూరంపుబండ్లను
పరికె। బండ్లను వాంతాలంపుబండ్లును జీడి। బండ్లను చిటిముటుబండ్లను
జాన। బండ్లను దానిమ్మబండ్లను మేడి। బండ్లను జిగినెల్లిపండ్లను మోది।
పండ్లను మారేడుబండ్లను బలుసు। బండ్లును సిరివిందబండ్లను దుమికి।
బండ్లు నారంగంపుబండ్లును। నరిగి। బండ్లను గజనిమ్మబండ్లను। కలిదె।
పండ్లు గమ్మరేన్బండ్లను జామ। బండ్లను। కలజువ్విబండ్లను। ద్రాక్ష।
బండ్లు మాదీఫలంపుబండ్లను। రావి। బండ్లున్యగ్రోధంపుబండ్లను వేప।
బండ్లను గోడపుడుబండ్లను। బుడమ। పండ్లు। జంచీరంపుబండ్లనుబనస।
బండ్లను పులుగుడుబండ్లను పాల। బండ్లను। చిలివిలిబండ్లననయింటి।
బండ్లను మొదలైనబండ్లను వెల్లంకి। కాయలు రేమిడికాయలు కలిసె
కాయలు మామిడికాయలు జిగురు॥ నిప్పపువ్వులు దేనెలివియాదిగాగ।
దప్పకఘనస నాంతరములుగొనుచు। వేగంబితమతమ వేలంబులకుస।
మాగతులై యీశ్వరార్చనజేసి। ఫలములుకజ్జములు బడిమోగిర
ములు। నవనిభత్ప్యాంన్న పానములుభోగించి। సంబరంబుసపరషత్కో
టియంత। తాంబూలములగొంచు। తండతండములు। తోల్లింటియట్లయు
త్సుకతబాడుగును। తిళ్ళియాడుచు గెడ తోడగూడుచును। మెల్లనసాగు
చు మెట్లకెక్కుచును। గొల్లముల్ డిగ్గుచు కురువలెక్కుచును। మోల
ముల్ సొచ్చుచు। నుద్ధతిజనుచు। శైలముల్ బ్రాకుచు చగులమీరుచును।
ప్రాంతంబులనుబూర్వ పశ్చిమంబునను। బంతులైసాగిన పర్వతావళులు।
గుంపులుగట్టిన కుధరసంఘములు। బొంపిరిగొనియున్న భూధరచయ
ము। కూటవల్ గూడిన గోత్రిసంఘములు। తూటుగట్టినమహాద్రిలు
సమూహములు। కూడనిబ్రహ్మండకొల్లను బెక్కు। జాడలజంగమస్థా
వరితతి। యటుగూడనద్రిమయంబైనమాడ్కి నటయిట కేగిన ముంద
టవెన్కనడుమ। నేదేశజూచిన నెన్నిక మిగిలి। యీదెసనడరు మహాద్రు
లనడుమ। జూచుచు సంతసించుచు మహోత్సవము। లాచరించుచు వేడ్క
నరుగముందటను॥ శృంగారభరసరాశివపంచమోత్త॥ సూంగకోటీర
జటాటవీమధ్య। మంగళశ్రీవియ గంగామహాత్త। రంగ్గిణీరంగత్త రంగో

పకంఠ। సగతినొప్పు భాస్వచ్చంద్రరేఖ। భృంగిహృదయభంగ పర్వతకనక। సవ్రతః క్రతత్రి పర్వతగద్య। పర్వతముఖ్యోరు పర్వతావళుల। నడుమగంగామహానదిజూడనొప్పు। తడయకభక్తి చంద్రవతిమున్బాచ్చు। మల్లికార్జున శిరోమండనంబైన। మల్లికాదామంబు మాడ్కి వెంశియును। భరితమైకానంగ బడసిమొక్కుచును। పరసహృదయ భంగ పర్వతంబెక్కి। గిరితుట్టతుదినుండి క్రిందుజూడంగ। నరగలోకముగాండి యుంటకుబెదరి। పందలహృదయంబు భంగంబునొంద। నందుండికా చియుయూర్చియుప్పొంగి। మునుకొనిమూటలు ముడియలువీంచు। లను గట్టుకొనుచు దలలుముడుచికొనుచు। గుట్టగచ్ఛలగట్టుకొనుచుపైవలువ। చుట్టుకొంచును జయ వెట్టుదోయనుచు। మెల్లనమెల్లన మెట్టుచుజనుచు। నొల్లనొల్లనమందికోసరింపుచును। యొడ్డురాలెక్కుచు నొదుకుచుగాంట్లు। గడ్డగింపుచుత్రోవ లంసిదొక్కుచును। దిగ్గుచువృద్ధుల దిగబడనీక। దగ్గరిపట్టుచు దాకొనిచనుచు। గడగడవడకుచు గాడ్లుజెమర్ప। దొడలూదికొనుచు త్రోపుదొక్కిళ్లు। వాచుచుగ్రింగోళ్ళులూరుచు నెడల। బారుచునురపిట జారుచుజనుచు। చిక్కుచునటగొంత సేదదీర్చుచును। చక్కనహృద్భంగ శైలంబుదరియ। నప్పర్వతాది మధ్యాంతముల్ గూడ। నొప్పెబరుసప్రవాహాహార త్వేడదనరి। కడుప్రియంభకనగాగ్రంబునందుండి।కడగొప్పగాత మీగంగాప్రవాహ। మేపారనిధాత్రి కేతెంచుపగిది। నాపరిమశోటి యంత సేతెంచి సంగతిహృద్భంగ శైలసమీప। గంగాప్రవాహాప కంఠదేశమున। బొంకమాకులసంది పొన్నలగొంది। మోకమారులరత మొల్లలకురుత। పనసల పొంత చంపకములవ్రింత। ఘనసారములయిరు వనటులకురువు। కమ్మరేవలత్రోవ ..డములకేవ। నిమ్మపాతలగూడ నేరేడ్లనీడ। కొండగోంగులపోక గురుజులయాక। బొడ్డుమల్లెలదోర బురుగులనేర। కరవీరములమెట్ట గురువులమిట్ట॥ సురగులవీద్ది యశోకంబులలోద్ది। చెంగలువలకుంట చింతలపెంట। గంగరేంగులమూల కాగ్గిలమోపిల। మందారములమంద మారేండ్లక్రింద। చందనంబులచెల్వ జాజులకాల్వ। సరళులలోయ భూర్జంబులడాయ। గురువకంబులచెంత గోవులక్రింత।

హింతాలములచాయ నీడలవాయ। సంతానములయంట జంమ్ముల
చెంట। వటములమలల లవంగపుసిలల। కుటజంబులెడల గుగ్గులముల
మడల। గూడచప్పరములు గుడిసెలుగోడ్లు। గూడారములు తెరలుల్
గొల్లెనల్ బన్ని। వేలముల్ దప్పక విడిసియుత్సుకత। గాలిలుచుఘనత
గంగాసంగమమున। జనికృతాస్నానులై జన్మనహాసి। ఘనఘోరకర్మ
పంకముపొంకమెడల। నంతనిష్ఠాంన్న పానాదివస్తువుల। సంతుష్టులైపరి
షత్కోట్యలర। పరిఖ్యాతి దోనమ రాజయ్యగారు। ముఖ్యంబుగాగ
ణము సహాషణమున। నంతకమున్న సంధ్యావేళయందు। నంతమహా
నిశి యందుసాంగముగ। నత్యంతభక్తి సమగ్రత మెరసి। నిత్యలింగా
ర్చన నియముల్ దీర్చి। యిష్టలింగపరిసా దేహోపభాగ। పుష్టసుగా
వాప్తి బొందనత్యంత। బసవన్నగీతముల్ పచరించువారు। బసవపురా
ణ మొప్పగజదువువారు। భరతోక్తినేలలు బాడెడువారు। నరుదండజం
దుల కాడెడువారు। నాళతులునేయుచు నలరెడువారు। శైలముల్ ఘూ
న్నిల్ల జయపెట్టువారు। నెట్టణశ్రిమమేద నిడిరించువారు। బిట్టమేల్కని
చూడ బ్రియపడువారు। గిరిసమూహంబొప్ప గీత్రించువారు। తెరు
పులచక్కట్లు దెలిపెడువారు। దమతమరాకలు దలపోయువారు। నమి
తఘోరాట పులకించువారు। ఆరబర్వతపు రాణాదులుజదువు। వారును
వినియెడి వారునుజెలగ' యిట్టితీర్థములు మున్నెన్నడు నెరుగ। మిట్ట
చోద్యములంచు నెన్నెడువారు। చెప్పెడిదేమి యాశ్రీపర్వతుండు। తప్ప
క నానావతారముల్ దాల్చి। చ మ్మైపరసకుజలములుచూపు। యిలలింగ
మూర్తులై సలుపునేమములు పండినతరువులయి ఫలములనొసగు। నిం
డుమేఘంబులై నీడలుజూపు। పల్లరులై పుష్పవాసనల్ జూపు। చల్లని
గాడ్పులై శ్రిమములువాపు। నలివారికాండయి విడిపించువిధము। వెల
యంగవనలెము విడుదలవిచ్చు। పండితులై చెప్పు బరమేశుమహిమ। గం
డుతలవరులై కాయమార్గములు। మహిబారుమృగములై మరపించు
దప్పి। విహగరూపంబులై వేడుకబొలయు। యతిధిరూపంబులై యర్చ
నలొందు। ధృతితపోమూర్తులై దీవనలిచ్చు క్షితివతులై బ్రిణమితు
లుగావించు। నెంతయునాప్తులై వాతములుజూపు। నంతంతపస్సులై యా

నలుజూపు। నతులజంగమరూపమై భక్తిజూపు। భూరితీర్థంబులై పుం
ణ్యులజేయు। నారంగబెంన్నిధులై ముక్తులొసగు। గాకయీపరసై ఘ
నదయాబుద్ధి। గాకున్నయిట్టి దుర్ఘటమార్గదుర్గ। భూరిపర్వతమ
హాద్భుతగుహాగహ్వ। రారణ్యదుష్ట మృగసురచోర। నాగసంశ్రిత ని
ర్జనప్రదేశములు! నీగిరీశ్వరుగాన నెట్లురావచ్చు। ననుచుపర్వతుని
మహత్వంబుగూడ। వినుతింపనటప్రొద్దు వేవుడునంత। దూరీకృతా

## నక్షత్రపర్వతారోహణం.

ఘుండు దోసమ రాజు। గారునుసద్భక్తగణసమూహంబు। మదినుబ్బ
యవసర మహిమసాంగముగ। నుదయమజ్జనములుద్యుక్తిగావించి।
యరుదెంచినియత సమంచితలీల। పరసయుచారు నపరమితపుణ్య। తర
నిజతీర్థయాత్రావిఘ్నహేతు। విరసవిస్తరఘోర విషయవారాశి।
గడచినమాడ్కి గంగాప్రవాహంబు। గడచితదీయ విఖ్యాతప్రవాహ।
పరివృతప్రత్యంత పర్వతావళుల। సురుచిరాభ్రంకష చూడాన్వితతుల।
పరలునక్షత్ర పర్వతమంత నెక్కి। తరిబరిషత్కోటి దాదిగసారి। కవుని
య్యసురగీఘ్రిణ కానిత్యసంగ। మముగా నదిమెరుంగు మాడ్కినొప్పారె।
ఘోరునవేగుచో బొంగుచుబింక। మాశ్రయగొంత దవ్వలరిపారుచును।
సంతసిల్లుచును ఖేషేజయజయయనుచు। నంతంతనెక్కుచు నలరియా
ఘూర్ణచును। తప్పక యప్పురా తనతీర్థచరులు। చొప్పారునుజ్వల సోపాన
ములుగ। ద్రొక్కుచునెక్కుచు దాటిప్రిల్లుకొనుచు। జిక్కుచుమ్రోకా
ళ్ళజేతులూదుచును। వంగుచుగ్రాలుచు పొంగుచుజనుచు। చెంగుచు
నొండొరు చెయ్యూదికొనుచు। చేదుకోచేదుకో శ్రీగిరినాథ। చేదికోమ
ల్లియ్య చేదికొంమ్మనుచు। చేదుకోచేదుకో శ్రీశైలనిలయ। చేదకోమ
ల్లియ్య చేదుకొంమ్మనుచు। చేదుకోచేదుకో చెజేతనొడయ। చేదుకోమ
ల్లియ్య చేదుకొంమ్మనుచు। కనికనిపాటలు గట్టిపాడుచును। చనిచని
చిందుల। జతులు కాడుచును। పరమోత్సవామృత పరిపూర్ణపుణ్య।
తీరపరిషద్భావ తతులుసంధిల్ల। శూలిశ్రీమల్లికార్జునుడుదయాను।
హాలరజ్జులచేది కొనవేండుక్రియను। కట్టురువడినగా గ్రింబెక్కెపరస।
యట్టిపవారిట్ల హారుకృపలేక। చెచ్చెరమోజనూచ్చెధమెట్టులెక్కె।వచ్చు

నక్షత్రి పర్వతమునానంత। అంతంతత్పధ శాగ్రితులై జనులు। కొంతవి
శ్రీమ మేది। గొబ్బున జెలగి। కట్టలుగట్టి నక్షత్రిపర్వతము। బిట్టిగల్గననొక్క
పెట్టనగూడ। పర్వతాంగ్రింబెల్ల పథమునా నెరవి। పర్వతయ్యామమ్ము
బాలింపుమనుచు। మొగ్రిక్కుచు నీడల జిక్కుచు బండ్లు। మొక్కుచు లీ
లల నెక్కుచు దేన। లెక్కుచు కాలకు సృక్కుచు సెలల। జెక్కుచు దొరు
వులమక్కుచు చలవ। తొగ్రిక్కుచు తాపంబు ద్రొగ్రిక్కుచునాత్మ। నిక్కు
చుజనిచని నిక్కుచు గిరులు। జూచుచు సుకృతముల్ నోచుచు భవము।
చాచుచు జముకల దోచుచు లీల। నేచుచు మార్గముల్ గాచుచు బరస।
ద్రొగ్రిచుచు వడివడి వేచుచు వగ్రితుల। భోగ్రిచుచు చేతుల వీచుచు భటుల।
రాచుచు గూకలు వైనుచు దరుల। దూగుచు నయ్యాల లూగుచు శ్రీమము।
లీగుచు బూదెనే ద్రోగుచు జలికి। వేగ్రిగుచు నెండల గాగ్రిగుచు బ్రియుల।
నాగుచు మది జెల రేగుచు బ్రీతి। వీగుచు మరుగుల డాగుచు గముల। మూ
గుచు నొల్లన నేగుచు బాదలు। దూరుచు గ్రింతల బారుచు దరుల। జూరు
చు జనలేక జీరుచు హితుల। దూరుచు నటుగూడ జేరుచు వారి। నారుచు
నందటి గీరుచు మంది। మీరుచు నతిధుల నేరుచు మొగ్రిక్క। దారుచు
గోర్కుల జేరుచు నెడల। నిలుచు చు ఫలముల విలుచు మదప్పి। దలచుచు
తుష్టిమై బొలచుచు గురుల। గొలుచుచు నిష్ఠమై గలచుచు భవము। గె
లుచు చు నటగూడ బిలుచు చు మూక। గలచు చు నదులకు వలచుచు ఖ
ములు। మలచుచు బనబయ్య దలచుచు ప్రీతి। గాగ్రిలుచు శరణని వాగ్రిలు
చు నాత్మ। సోలుచు వెనదప్పి దాలుచు నట్లు। తూలుచు నాదంబు గోగ్రిలు
చు గతికి। వాగ్రిలుచు సుఖలీల తేలుచు భక్తి। దాలుచు భవముల వోలు
చు బుధుల! బోలుచు మదిగోర్కె దేలుచు శివున, గూర్చుచు నేమంబు
దీర్చుచు నుతుల। బేర్చుచు నలి రేగి యార్చుచు మునుపు। జనుచు వీడి
యములు గొనుచు మీ శరణ। మనుచు జంగమము దన్గొనుచు దాళములు।
గూడుచు సిరిగిరి బాడుచు జతుల। కాడుచు నానగులు వీడుచు నలరి। గో
యంచు చాంగుభళా యంచు మల్ల। యాయంచును ఘొయ ఘొయనుచు
గూడంగి। జయ వెట్టి జయ పెట్టి జయ వెట్టుడనుచు॥ జయ జయ జయ జయ
శరణు యాయనుచు। నరగలిగొనకిట్టు లఖిల దేశముల। పరసయు నానంద

భరితమైనదువ। నరుదొందన దులో నాంధ్రిదేశంబు। పరసబంతులుగట్టి

## ఆంధ్రిదేశపరస.

పాడుడెట్లనిన॥ నల్లవ్వొనల్లవ్వొ నగరాజరాజ। మల్లయామల్లయా మహా నీయ్యతేజ! పరమపాతకశ్కోట్లు భస్మమైతూలు। సిరిగిరిమల్లన్న శరణ న్నజాలు। గారోవనెంతదూరంబైననదువ। నేబోదుమల్లయ్య నేటేటగొ లువ। పాతాళగంగా ప్రివాహామైైన। జూతునేమల్లికార్జునదేవదేవు। చుక్కలపర్వతంబెక్కుడొంతైన। చిక్కకపోదునే శిఖరేశుగాన। నాయ కోత్రై ముక్క నాయకుదండ। నాయకు బసవన్న బాయకకొలుతు। శృంగిబొప్పయునుత్త మాంగదక్కేసి। సంగన బసవన్న శరణుగొలుతు। పండితారాధ్యు శ్రీపతిపండితయ్య। బండాగుబసవన్న బాయకకొలుతు। శంశర దాసయ్య వెంక మంచయ్య బంకయ్య శివరాత్రి సకయ్యశ రణ। యేదేశు కేతయ్య యిండె పాంతయ్య। మోళిగమారయ్య ము న్నయ్యశరణు। బావూరి బంహ్మయ్య శాచి రాజయ్య। కోపూరి బ్రిం హ్మయ్య గొగ్గయ్యశరణు। కింన్నెర బ్రింహ్మయ్య కేశి రాజయ్య। కన్న డ బ్రిహ్మయ్య గుండాశిశరణు। బాచయ్యసనరద నాచయ్యబిబ్బ। బాచయ్యమడియాలు మాచయ్యశరణు!శిరిగిరిశరణు శ్రీగిరినాథశరణు। సిరిగిరిమల్లయ్య శరణులుశరణు। లనుచు నీకిృియనుబ్బి యాడుచుబాడు। చును బేర్చి పేర్చి యుత్సుకతమైనదువ॥ చెన్నారగుదియిట్ల కన్నడ

## కన్నడపడపనడక.

పరస। పన్ననికన్నాట భావసాంగముగ। అజగమదేవయ్య బిజమా దిరయ్య। నిజభావిదేవయ్య నీవిత్తబస్ని। అల్లమదేవయ్య అందెకేహెద। బల్లడదేవయ్య బన్ని దేనీను। శిలముదుదేవయ్య చిల్కపేరయ్య। శివరా త్రిబసవయ్య చిత్తువిన్నయ్య। విరుపాక్షిదేవయ్య కరుణచుజేగ। వురువణి సంగయ్య హాగుడెభారయ్య। మహాలింగదేవయ్య మండిబేడయ్య। సహ సుకిదేవయ్య నరసరబన్ని। భవదీగదేవయ్య బందెవల్లయ్య। శివదేవసు లబేడ శీఘ్రితబన్ని। గురుదేవనీకుణికుణిరాడమేకి। సిరిగిరియిదినిమ్మ సిరిగిరిరకల్లయ్య। సంగదేవయ్య। ప్రిసాదిదేవయ్య। లింగదేవయ్య యు త్తుంగదేవయ్య। యమృతదేవయ్య [illegible]దేవయ్య। విమలాత్మదే

వయ్యా విశ్వనాథయ్యా। సర్వజ్ఞదేవయ్యా శాంతిదేవయ్యా। పర్వతదేవయ్యా భగిరిదేవయ్యా। జాణదయ్యా నిర్వాణదేవయ్యా బాణదేవయ్యా కళ్యాణదేవయ్యా। పంసహేయితుబెగ బిన్నిలపగళ। తరలాసినావు సింపతక్షీలవెనుత। హెమ్మవ్వరుమ్మవ్వ హెగ్గవ్వబన్ని। యమ్మవ్వచిమ్మవ్వ బొమ్మవ్వబన్ని। గుడ్డవ్వదుగ్గవ్వ గొగ్గవ్వబన్ని। హూడ్డవ్వహూల్లవ్వ హూచవ్వబన్ని। అక్కవ్వయాదవ్వ రక్కవ్వబన్ని। జక్కవ్వ రేకవ్వ సాకవ్వబన్ని। సంగవ్వలింగవ్వ సాగవ్వబన్ని। గంగవ్వరామవ్వ కామవ్వబన్ని। పద్మిధవ్వ గదిర్వ భదిర్వబన్ని। కొమరవ్వవీరవ్వ విమలవ్వబన్ని॥ చెన్నవ్వహూన్నవ్వ కన్నవ్వబన్ని। జన్నవ్వసాంకవ్వ సత్తెవ్వబన్ని। శరణవ్వసామవ్వ సకలవ్వబన్ని। పురుషత్వఅప్పవ్వ బొప్పవ్వబన్ని। మత్రిరిల్లెడిదేవి మల్లడదేవి। బత్తిరేశ్వరదేవి బిసలదేవి। నగదేవిగుసదేవి విరుపాక్షదేవి। సిరిదేవి మహాదేవి సిద్ధలదేవి ఉసుదేవి శివదేవి యుద్భటదేవి। సమభావదేవి బాచలదేవిబన్ని। ముదిస్పెబాగళుబెడ మందతొహాల్ల। హేదిదేనిల్లలు బెడయిరుబద్దెభయవు। హాకదేనిల్ల దేహూందాగనమ్మ। బలవల్లి కిలదల్లి బన్నెబన్నినుత। వారికారందుతిమ్మనరవిందబరము। సారబర్వతవి ద సంతోసదల్లి। యొబ్బరబ్బరనోడిరొంచతల్ ఘనత। రుబ్బెతల్ మత్తెంత హుబ్బుతల్ హాచువు। తొరులతల్ బడలి కజరువుతల్ సుంతి। నెగువుతల్ ముదడింద బెడవతల్ శివన। కెడవు భక్తరన్ హెదవుతల్ మహిమ। సారుతల్ సమయగల్ మీరుతల్ వంక। మేరుతల్ మంది యాళ్మగుతల్ వెలహి। సిందుగళికుక్కతల్ సిద్ధిగాళగళు। నందీశుతళు తాళ నదిగెమిటుటలు। నడివరినత్తువల్ నాలికెహిండె। నడినడెయనుత సందడినల్తగూడి। కయ్యతాళంగళకలిళుబారిసుత। మెయ్యెల్లబాయాగి మృడనహాడెలబా। హుబ్బుత్త గొబ్బుత్తి యుబ్బియాడుత్త। వర్బ్బతదొషయంగె భక్తిమాడలీబా। హొముత్త లాము త్త మోడుత్తబత్తి। మాడిబోసిరిగిరి మల్లికార్జునగె। బాన్ణేశమణగె శిర్పబ్బతనుదయ। మాణెద సెన్న బోమల్లికార్జునని। హరహరశివశివా శరణునమ్మిశరు। సిరిగిరిమల్లయ్యా శరణన్నిరయ్యా మంగళామూరితి మల్లయ్యనాళు। నంగనబసవయ్యా శరణన్నిరయ్యా। బసవన్న యథార్థ సల

కేహుళిగను। పసరినిమాణి భోబత్తిమల్లయగె. అనియుట్ల బాడుచు నా డుచుబీరితి। పచుగొసిక్కన్నడ పరసయేతేర॥ అరుదుగానట్లతా నారదే

ఆరెపరసనడక.

శంపు। పరసయుమరహాట భాషపెంపార। మాగారగొనకొన మజబాప్ప మణతి। భాగవతేసకే భక్తి తేమణతి। పురహారకెతదూరి పురహా తేమ ణుతి। శరణదేచిపురిజ వరితేదమణతి। అఖసిరికైలాస దెఖికారమణతి। సుఖముఖాములులోగ పురఖియయామణుతి। మగమహాటజి మహాదేపు యాజి। గగణయాణారాజి కైలాసయాజి। అభిమరాణీయాజి। సుభిదేవు యాజి ఆభివేరె దేహించి అప్పవేలింగ। సిగిరిమల్లయ్య వరమదియత్త। పరసుకిసుకేచేగ వరదుహేళిత్త। సుఖతాళగతిమాన వఖిలఖఖిణచె। వఖ రకెసిరిగిరి మల్లయ్యరాణ। ఆలానిబద్ధసతానిగీతాచె। మాలానమప్పణ మల్లయ్యరాణ। పత్రిబ్బతసంతాప సారనాటకనె। పత్రిబ్బతమల్లయ్య పత్రి బ్బజనె। హంశెమణాపుణా హాకుబూచుచిత్త। అంశమహాభక్త యు ఖనెనంమ్మెళ। యనుచుచిందులువెట్టి యాడుచుబాడు। చును పరసయు

అర్వదేశపుపరస.

జనుదేరమరియు। అరుదొందనట్ల సయ్యరువదేశంబు। పరుసయుదాక్షిణ భాసనాంగముగ। అరుగులుగిరితెంన్నె అరనెవరానె సిరిగిరినిలయనే చిర నెలందవనె। అంగమూరుంచానె మరియిందవనె। మంగయారోంగానె మల్లికార్జుననినవనె। అనునక్కడియను నఖిలనాయకనె। యానవిల్లొదాన ఋల్లవిల్లయవ। అరపత్తుమువ్వార కాత్మనాయకనె। మరణలుమడియాత మల్లికార్జునవనె ఆలోలగండని యాదిమాళ్ళవనె। చూలియేమల్లికా ర్జునవనె॥ యన్నవనె। మెల్లయిల్లాదానె మెంగుముళ్ళవనె। చోళ్ళప్ప న్నాదానె మల్లికార్జునవనె। ఆరుంచు దిందూరు జారుముళ్ళవనె। యేగే రుమిాశనే మెల్లమల్లయనే॥ వేదిమెడినుదిక్కు మోదిమెచివనె। చోది యెమల్లికార్జునవనె యన్నవనె। యనుచు చిందులుబెట్టి యాడుచుబాడు।

గీర్వాణభాష.

చును పరసయుత్సుకతనే తేర॥ అరవిరిగానక నిట్లఖిలదేశములు। పరస యుసంస్కృతభాషబెంపార। ఆయాతపరిషదా యాహినభిత్వ। మా

యాఖిసన్మార్గ మతిరథ సేన। ఆతపక్లాంతాస్మి హారమహారమణ। దేవ
దేవహీ పుర మిందీవరాక్ష। దృష్టవిశింష్టాంస్తు దేహిపశ్రిమోద। మిష్టరా
యునిసదా హేళరభోరు। శాన్తింతాంసికింసఖ శైలతటేషు। శాన్తింతిగ్ర
తాపూర్వ। సంవీక్షణేన। జలజాక్షీ గురుపిపా సాపరిహార్తి। కలశస్తప
దోద కంపిబస్వాదు। ఉత్తంసియాంజలి ముద్వీక్ష్యనగర। మత్తాలఫల
సిద్ధి రుపకంఠమేతి। నాథంభవానీస నాథమన్నాథ॥ నాదమాత్మనస మ
ల్లినాథంభజస్వ। అన్యోన్యసల్లాప నాన్యోన్యవంద। నాన్యోన్యకృతవి
నయ యశమేశ సేన। శుభకరశ్రీశైల చూడాకరాయ। అభవాయశ్రీ
మల్లికార్జునాయనమో। కరుణాకరాయ శ్రీకంఠాయకర్మ। హరణా
యశ్రీమల్లికార్జునాయనమో। అంబకత్రితయాయ హరశంకరాయ।
సాంబాయశ్రీమల్లికార్జునాయనమో అద్యంతవిరహితా యనమశ్మ
వాయ। అద్యాయతేమల్లికార్జునాయనమో। ఆయురారోగ్య ప్రదా
యకప్రమథ। నాయకశ్రీమల్లినాథమాం పాహి। మల్లికామాలికా మ
స్తకాభరణ। మల్లిగార్జున దేవ మామేవపాహి। మల్లికాఘనసార మం
దారదేహా। మల్లికార్జున దేవ మామేవపాహి॥ మల్లికార్జునయశో
మండితాశాంత। మల్లికార్జున దేవ మామేవపాహి। అనుచుసంస్కృత
భాష నెంతయు నెరవి। యనురక్తిపాడుచు నాడుచునం । మాళవకా
స్మీర మాగధసింధు। గౌళతురష్క కొంకణసూరసేన। బంగాళకాంభోజ
పాండ్యఘూర్జరక। లింగబర్బరసింహళ ళికకరహాట। సౌరాష్ట్రలాట
ప్రశస్తదేశముల। వారాదిగాగ జెంపాదిదేశముల। యందునుమధ్య
దేశానీకమర్త్య। సంతోషమునుసల్ల సహజభాషలను। మసలియొండొ
రుతో మాటలాడుచును। పసరించిశ్రీగిరి ప్రణుతి సేయుచును। జతిదేశి
బిందుచరితాళాను। జతియుగ్గళనప దశప్రతియాదిగాగ। జనున్వదేశవి
దేశ సరణివెండియును। ననుపక్తిపాడుచు నాడుచుసల్ల। చెలగినానా
దేశ ములకప్పడీలు। కంకలంబుగగముల్ గట్టియాడుచును। అ తనత్యా
త సమగ్రతనంత। కాంతకుండగు మల్లికార్జునుపురము। కడునొప్పి
ముందట గానంగనయ్యె। నడరిదన్మహిమ యేమనిబ్రస్తుతింప। గీరిద
ర్శనముభక్తి కనిహేతువవిన। పురిదర్శనములు మెపొక్క వర్ణింప।

